# న మ స్తే

జీవితం ఒక చిత్రమైన శకటం. అది 'సుఖం-దుఃఖం' అనే రెండు చక్రాలపైన ఆధారపడి సాగిపోతున్నది. ఐతే-సామాన్య మానవుడు ఎంతసేపూ 'సుఖం ఎక్కడ? సుఖం ఎక్కడ?' అని తపించి పోతూవుంటాడు. అటువంటప్పుడు మిగిలివున్నది 'దుఃఖం' అనే ఒక్క చక్రమేకద! ఒక్క చక్రంతో శకటం సాఫీగా సాగేదెట్లా? అందుకనే సుఖ దుఃఖాలు రెండింటినీ సమభావంతో చూడాలంటారు పెద్దలు. అలా చూడగల్గినవారే జ్ఞానులని మహాప్రవక్తలందరూ ఐక్యకంఠంతో వాకొంటున్నారు.

పోతే-సుఖమనేది రెండు విధాలుగా కనిపిస్తున్నది: జన సామాన్యం కోరేది ఇహలోకసుఖం; పరమహంసలు కోరేది పరలోక సుఖం. ఒక్కమాటలో చెప్పాలంటే-అందరూ కాంక్షించేది సుఖావాప్తి, దుఃఖనివృత్తిన్ని. మనకు దూరంలో ఉండే పరలోక సుఖం మాట అటుంచి, ఇహలోకసుఖాన్ని గురించే ఇప్పుడు ఎత్తుకొందాం.

దుఃఖానికి హేతుభూతములైనవి కష్టాలు. చాలవరకు ఈ కష్టాలకు కారకులం, ఉత్తరవాదులమూ మనమే. ఈ మాట నిశ్చయం. ఈ దుఃఖాలనేవాటికి కారణాలేమిటి? వాటిని నివారించే ఉపాయాలేమిటి?—ఈ మొదలైన ముఖ్యవిషయాలు ఈ చిన్నిపుస్తకంలో చదవండి. ఇందులో ఉదహరించబడిన సూక్తులు, దృష్టాంతాలు, ఉపదేశాలు, అన్నీ గొప్ప అనుభవంమీద చెప్పినవీ, కాలపరీక్షకు నిలిచినవిన్నీ.

దుఃఖం ఎప్పుడైతే తగ్గిందో, ఇక మిగిలేది సుఖమేకద! మానవుని సుఖజీవనానికి దోహదం చేయడమే ఈ రచనయొక్క వుద్దేశం. ఇది సాంఘిక సంక్షేమ సాధనాలలో తొలిమెట్టు.

కోరినంతనే, అత్యుత్సాహంతో ఈ పుస్తకాన్ని ముద్రించి మా ఉద్యమానికి చేయూత ఇచ్చిన ఉదారహృదయులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి ఎంతయినా కృతజ్ఞులం.

—బుక్‌మన్స్

*
* *

"నేల నే విత్తులు - నీవు చల్లెదవో
యా సస్యమే కోసి - యనుభవించెదవు,
సత్కార్మములు చేసి - సంతసించెదవు,
దుష్కార్మములు చేసి - దుఃఖమొందెదవు."

* *
*

# జీవితేచ్ఛ

**మ**న మహాకవి గురజాడ ఏమంటున్నాడో విన్నావా—

> 'ఈసురోమని మనుషులుంటే
> దేశమే గతి బాగుపడునోయ్!'

ఏం?—ఎప్పుడూ అశోకలాగా మొహం పెట్టుకు ఉంటావెందుకూ?— నువ్వే కాదు. లోకంలో ఎక్కడ చూచినా ఇలానే వుంటున్నది. ఇలా అనడానికి కారణం ఏమిటంటే—నేను సుఖంగా వున్నాను, అని గుండెమీద చెయివేసుకుని, నిబ్బరంగా చెప్పినవాళ్లు ఇంతవరకు ఒక్కళ్లూ నాకు కనిపించకపోవటమే.

దయామయుడైన దేవుడు మనకు కావలసిన గాలి ఇచ్చాడు; నీరిచ్చాడు, ఆహారపదార్థాలూ పుష్కలంగా ప్రసాదించాడు. ఇన్నీ ఇచ్చిన ఆ దేవుడు 'సౌఖ్యం' అనే వస్తువు మట్టుకు ఇవ్వలేడా? ఇచ్చేవున్నట్టయితే, అటువంటిది కొంత మందికి మాత్రమే ఇచ్చి, తక్కినవాళ్లకు ఇవ్వకుండా వుంటాడా?- ఐవుండదు.

చూడబోతే, ఈ సృష్టిలో జంతువులు, పక్షులు, చివరకు వృక్షాలుసైతం హాయిగా ఉన్నట్టే కనిపిస్తుంది. అటువంటప్పుడు, వాటి వేటికిన్నీ లేని బుద్ధి ఒకటి మానవునికి విశేషంగా ఉన్నదే?

మరి ఆ బుద్ధి ఉపయోగించుకొని, వాటన్నిటికంటే తను ఎక్కువ సుఖంగా జీవించవద్దూ?—అంటాను.

నేను చెప్పే మాట ఒక్కటి: మానవునికి అత్యావశ్యక మైన సౌఖ్యాన్ని దేవుడు ప్రసాదించేవున్నాడు. సౌఖ్యం నీ జన్మహక్కు. కనుక, సంతోషంతో ఉండు. అలాగాక, దుఃఖ పడుతూఉంటివా, ఆ దోషం నీదే అవుతుంది. 'ఈ జీవితం నాకు సుఖంగా లేదు' అని నీవు అంటే ఆ అసౌఖ్యానికి ముఖ్యకారణం నీవు ప్రకృతి నియమాలను మీరి నడుచుకోవటమే. ఆ తప్పు నీదే అని గట్టిగా చెప్పగలను. ఈ మాటల్లో ప్రతి అక్షరం ఋజువు చేస్తానుకూడా.

మరొక్కమాట: అనాదినుండీ సంస్కర్తలూ మహాప్రవ క్తలూ లోకక్షేమంకోసమే ఉద్భవిస్తూవున్నారు. ప్రజకు సౌఖ్యం చేకూర్చడం ఎలాగా అనేదే వారి నిరంతరకాంక్ష అయివుంటు న్నది. అందుచేత, వారు పెట్టిన వరవడినిబట్టి నడచుకొన్నా మంటే—ఇప్పుడు కాదు, ఎప్పుడయినా, మనం సౌఖ్యం పొంది తీరుతామనే నమ్మవచ్చు.

ఇప్పుడు—

'జీవితం సుఖంగా లేదు' అని ఒక్కమాటలో అనేస్తే అది సమంజసం కాదు. నీ అసౌఖ్యానికి కారణం ఏమిటైవుంటుందో కాస్తంత విప్పి చెప్పాలి. ఇదే ఒక్కళ్లూ చెప్పలేకుండా వున్నారు. నేను చెప్పనా? సామాన్యంగా మానవునకు సుఖంలేకపోవటానికి

కారణాలేమిటో, వాటిని నివారించుకునేటందుకు మార్గాలు ఏమిటో చెబుతా, విను—

మానవుడికి సౌఖ్యమిచ్చేవాటిల్లో మొట్టమొదట వచ్చేది ఆరోగ్యం. శరీరం ఆరోగ్యవంతంగా వుంటేనే మనసు హాయిగా వుంటుంది. కనుకనే, శరీరం అనే దేవాలయాన్ని పవిత్రంగా ఉంచుకోవాలంటారు పెద్దలు. అప్పుడే ఆరోగ్యం బాగా వుంటుంది. ఆరోగ్యం బాగా వుంటేనే ఆయుస్సు వృద్ధి అవుతుంది.

ఐతే—ఆయుష్షు వృద్ధికావడ మెందుకయ్యా? అని నీవు అడగవచ్చు. ఎందుకా!—బ్రతికి పట్టంగట్టి ఆరోగ్యంగా వుంటేనే కద, కోరికలు తీర్చుకోన గల్గటం?—లేకుంటే మనం జ్ఞానం ఎలా సంపాదించటం? ధనం ఎలా ఆర్జించటం?—మహర్షులు ముక్తి మార్గం కనుక్కోవటానికైనా శరీరాన్ని భద్రంగా కాపాడాలి. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్' అనికదా పెద్దల నుడి. శరీరం ఆరోగ్యవంతమై వుండాలి. అనారోగ్యంగా వుండే శరీరం వుండేమి, లేకేమి? అవునా? సామాన్యమానవుడికీ మహాఋషికీకూడ ముందు ఆరోగ్యంగా వుండే శరీరం అగత్యమైవున్నదని తేలింది.

అందుకనే 'ఆరోగ్యమే మహాభాగ్యం' అని అన్నారు పెద్దలు. ఈ నీతివాక్యం చిన్నప్పుడు అందరమూ నేర్చుకున్నదే. నిజానికి ఈ మాట తెలియనివారెవరు?—అయినా, ఒక్కసంగతి మట్టుకు నిజం. తెలిసీ కూడా పడని పదార్థాలు తినటం, అన్నపానాలలో ఒక మిత మనేది లేకపోవటం, ఒళ్లు తెలియని శ్రమ పడటం, శరీరానికి వ్యాయామం లేకపోవటం—ఇటువంటి ముటికి

గుణాలవల్లా, చెడు అలవాట్లవల్లా చాలామంది చక్కని ఆరోగ్యాన్ని చెడగొట్టుకుంటున్నారు. ఏమంటావు?

ఇలా ఆరోగ్యం విషయంలో ఓనమాలు కూడా తెలియని పరమమూర్ఖులు ఎంతోమంది ఉంటున్నారంటే ఆశ్చర్యం కదూ?– ఇల్లాంటి పరిస్థితిలో 'ఈ అనారోగ్యానికి కారకులు ఎవరు?' అని అడిగితే జవాబేమిటి?—అసలెవరో 'నాదే తప్పు' అనే మాటలు వినిపిస్తున్నై.

కొంతమంది అంటారుకదా—'అయ్యా! మాగ్రామంలో చదువు సంధ్యలు నేర్చుకుందామంటే తగిన వసతి లేదండి. మరి, అటువంటప్పుడు మావూళ్లో అందరూ నిశానీవద్దులే కాని, డొక్కశుద్ధి ఐనవాళ్లెక్కడినించి వస్తారూ?' అని.

అదేంమాట, తప్పుతప్పు. గ్రామస్థులికి నిజంగా చదువు కావాలనే కాంక్ష ఉన్నట్టే అయితే, వారు అభివృద్ధి పొందే మార్గాలు తప్పక కనిపించేవుండును. చేత పైసా లేని గర్భదరిద్రులు సైతం గొప్పగొప్ప చదువులు చదివినవారిని ఎంతమందిని మనం చూడటంలేదు? కనుక, గట్టి సంకల్పమే ఉన్ననాడు వాంఛితం నెరవేరి తీరుతుందిగాని మానదు.

మరొక చిత్రమేమిటంటే— చేవ్రాలు చెయ్యలేని విద్యావిహీనులు సయితం పెద్దపెద్ద పదవులు ఆక్రమించటంకూడా ఈ రోజుల్లో చూస్తూనేవున్నాంకద!

ఇక—తరుచు మానవులు చెప్పుకొని మూలిగే కొన్ని కొన్ని సమస్యలు- వింతగానూ విడ్డూరంగానూ ఉంటూ

వుంటాయి: 'సంఘంలో మాస్థితి చాలా నీచంగా వున్నది. మమ్మల్ని ఒక కంట చూచేవారూ, ఉద్ధరించేవారూ లేనేలేరు'అని ఒకరు. 'అబ్బా!— నాకు సంతానం ఎక్కువ. ఇంతమంది బిడ్డల్ని ఇచ్చాడు కాని ఆ మాయదేవుడు, వాళ్లను పోషించటానికి తగిన తోవ అగపరచలేదు' అని ఒక పిల్లలతండ్రి ఘోష. 'అయ్యో!— మాకు బోలెడంత ఐశ్వర్యం మూలుగుతూ వుంది. కాని...ఎందుకు వచ్చింది ఇదంతా! ఎవ డనుభవించను? వేలెడంత నిసుగు లేకపోయెకదా'అని ఒక సంతతి లేని శ్రీమంతుడు.- ఇటువంటివన్నీ విచారించతగ్గ విషయాలేనా— నిజంగా దేవుడు చేసిన లోపాలేనా?- వట్టిమాట.

ఒక కోటీశ్వరుడున్నా డనుకుందాం. ఆయన్ని చూచి లోకులు అనాలోచితంగా అసూయపడతారే గాని, ఆయన ఈ స్థితికి రావటానికి ఎన్నెన్ని శ్రమదమాదులు పడివున్నాడో కాస్తంత జీవితంలో లోతుకి పోయి చూడరు. చూచే వున్నట్టయితే ఆ కోటీశ్వరుడు స్వయంకృషివల్లనే ధనవంతుడైనట్టు స్పష్టంగా రూఢి అవుతుంది.

కాబట్టి మనం కూడా వాళ్లలాగా కష్టించి సంపాదించుకుందాం అని తాపత్రయ పడాలెవేకాని, ఊరివాళ్ల సొమ్ము ఊరికే వచ్చి ఒళ్లో పడలేదే అని యేడవకూడదు. పరాయిసొమ్ముకోసం అలానే కనిపెట్టుకు కూచుంటామంటే చివరకు మిగిలేది ఏడుపే.

తరువాత, సంతానాన్ని గురించి—'కనటం మానటం మనయిష్టంతో యేమున్నది?—అంతా పరమేశ్వరుడి కృప!'అని చాల

పుంసి ఉండావచ్చుండాకు. కావచ్చు. ఐనా ఒక్క విషయం చెప్పాలి: సామాన్యమైన ఆరోగ్యంగల దంపతులు తమకు కావాలన్నప్పుడు సంతానాన్ని కనటం, అవసరం లేదనుకున్నప్పుడు ఇంద్రియనిగ్రహం వల్ల కనకుండా ఉండటం కూడా కద్దు.

ఇదంతా ఎందుకు చెప్పవచ్చానంటే—మానవుడు తన సుఖం తను సంపాదించుకోవటానికీ, సంఘంలో ఉండే ఉచ్చ-నీచస్థితులకీ ముడి పెట్టుకోకూడదు. తను సంతానం కనటానికీ మానటానికీ సంఘ పరిస్థితులతో ఏవిధమైన ప్రసక్తి లేదు.

ఉపయోగకరమైనటువంటివీ, న్యాయమైనటువంటిదీజీవనం చేసుకో. అందరికట్లా మర్యాదగా ప్రవర్తించు. వీలైనంత ఎక్కువ మందితో కలిసిమెలిసి వుండు. అలా అని ఎవరితోనూ అతిపరిచయం పెట్టుకు పద్దుసుమా. కొందరితోనైనా స్నేహం కలిగి యుండు. కాని, ఎవళ్లతోనూ శత్రుత్వంమాత్రం పెట్టుకోవద్దు. ఈ లక్షణాలుంటే చాలు. ఇవి అందరికీ సాధ్యమేనంటావా? —సాధ్యమే అయినపక్షంలో సౌఖ్యం అనేదికూడా సర్వజన సాధ్యమే అంటాను.

ఇష్టమైన వ్యాపారం లభించలేదని కొందరు పరితపిస్తూ వుంటారు.

అయ్యో! ఈ విషయంలో ఇంతగా శ్రమపడినామే, శ్రమకు తగిన ఫలందొరకలేదుకదా అని కొందరి అసంతృప్తి. ఇష్టమైన ఉద్యోగం సంపాదించటానికని మానవుడు తనకు సాధ్యమైన యత్నాలన్నీ చేయవలసిందే.

ఒకవేళ దొరకదయ్యా - కోరుకొన్న ఉద్యోగం దొరక నప్పుడు ఏమిటి చేయటం ? తక్కిన అందరూ ఏంచేస్తున్నారో ఆ మానవుడూ అదే చేయాలి. అంటే—ఏదో ఒక పనిలో—లభిం చిన ఉద్యోగంలో ప్రవేశించటం, యావచ్ఛక్తీ ఉపయోగించి, న్యాయంగా నిష్కపటంగా కృషిచేసి కృతార్థుడు కావటమున్నూ. అంతేకాని, ఈ కారణంచేత ఎవడూ విముఖత చెందనక్కరలేదు.

మానవుడు చేసే ప్రయత్నాలు కర్మఫలంమీద ఆధార పడి వుంటాయని పెద్దలు చెబుతారు. కర్మఫలమనేది కేవలమూ దైవాధీనం కాని, మన వశంకాదు. కర్మహేతువుచేతనే మనం చేసే పనులకు మంచిఫలమో చెడ్డఫలమో, అటూ యిటూ కాకుండా మధ్యరకపు ఫలమో మనకు వచ్చితీరుతుంది. ఆ వచ్చిన ఫలంతో మనం తనివి పొంది ఉండవలసిందే! అంతకంటె మనం ఏంచేయగలం ?—

ఈ పని చేస్తే ఏవిధమైన ఫలం వస్తుందీ? అనే చింత ఎంత మాత్రమూ మనసులో లేకుండా పనులు చేసుకు పోతూవుండు. నీ మనసుకు మంచి పని తోచిన పనులల్లా చేయటమే నీ వంతు వాటికి తగిన ఫలమీయటం దేవుని వంతు. నీవు చేసిన పనికి ఫలం. నీవు ఆశించనప్పుడు అది ఎటువంటి ఫలమైతే నీకేం ?

ఫలాన్ని ఆశించినావో, అప్పుడే పట్టుకుంది నీకు విచారం. ఏమీ! నీ వొక పని చేసినప్పుడు ఒకవిధమైన ఫలం ఆశించవచ్చు. కాని, చివరకు నీకు దక్కిన ఫలం మరొకవిధంగా ఉండవచ్చు. అటువంటప్పుడేకదా ఆశాభంగమూ, విచారమున్నూ కలగటం ?.

కనుక, అలా ఆశించడంతో దుఃఖం స్వయంగా తెచ్చి పెట్టుకొన్న వాడవవుతున్నావు.

మనం పనులు చేస్తూవుండటం, ఫలితాలకోసం ఆశించకుండా వుండటం—ఇదే మనం పాటించవలసిన అమూల్యమైన సూత్రం. ఇదే ప్రతివారు నిత్యజీవితంలో అవలంబించవలసిన సూత్రం. ఇదే మానవునికి సౌఖ్యాన్ని ఇచ్చే గీతాబోధ.

భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ ఏమంటున్నాడు అర్జునుడితో—'ఓయీ అర్జునా!—నేను చెప్పినట్టు నీవు చేస్తూవుండవోయ్. దాని ఫలితం సంగతి నాకు వదిలేయి' అని ప్రబోధించాడు. ఇదే నిరపాయమైన మార్గం. సమస్త సౌఖ్యాలనూ సమకూర్చే రాచబాట. దీనినే మానవుడు నిత్యజీవితంలో ఆచరించటానికి ప్రయత్నించాలి. ఎందుకని? - ఇదే సరి ఐన మార్గం గనుక. లేదూ అంటే, మనంతట మనమే దుఃఖం తెచ్చిపెట్టుకొన్న వాళ్లమవుతాం.

చాలామంది అసౌఖ్యంగా ఉండటానికి గల కారణాలలో ముఖ్యమయింది డబ్బు లేకపోవడం. ఈ ప్రపంచంలో ఏ పని నెరవేరాలన్నా, అగత్యమైన సాధనం ధనమే. డబ్బు లేనివాడు పైసాకు కొరగాడు. ధనమనేది చేతిలో వున్నట్టయితే కొండమీది కోతి దిగివస్తుంది! ధనం ఇంత మహత్తరమైంది గనుకనే డబ్బులోనే దేవుడున్నాడనే వాడుక లోకంలో అల్లుకుపోయింది.

నిజమే. ఇదంతా బాగానేవున్నది. ఐతే, నాదొక ప్రశ్న: డబ్బే దేవుడయితే, డబ్బుగల శ్రీమంతులందరూ సౌఖ్యంగా

ఉండాలికదా? ఉన్నారేమో చెప్పండి, చూతాం. చెప్పలేరు. కనుక ధనమొక్కటే ఈ జీవితానికి పరమావధి కాదు. అది జీవితం నడుపుకోవటానికి ఏర్పడిన సాధనాలలో ఒకటి. అంతే. అందుచేతనే ధనానికి తగని ప్రాముఖ్యత యివ్వకూడదని అంటాను.

ఈ మాట బాగా అర్థంచేసుకోవాలి. మనం ఏవిధంగా ధనార్జన చేస్తున్నాము? మనం అవలంబించే మార్గాలవల్ల ఇతరులకేమైనా బాధ కలుగుతున్నదా? అనేవిషయాలే ఆలోచించకుండా, ఆరోగ్యాన్నయినా పాటించకుండా, వేలంవెఱ్ఱిగా డబ్బుసంపాదనలో మునిగివున్నవారు నూటికితొంభై తొమ్మండుగురు.

డబ్బు! డబ్బు!! డబ్బు!! ఏదోవిధంగా, ఎవళ్లనెత్తి కొట్టియినా సరే, నాలుగుడబ్బులు సంపాయించటమే పని. ఇటువంటి పనిలోనే ఎంతోమంది కొట్టుమిట్టాడిపోతున్నట్టు కళ్లారా చూస్తూనే వున్నాం. చచ్చిచెడి ఆర్జించినారయ్యా! ఆ ధనాన్ని సవ్యమైనమార్గాలలో వినియోగిస్తున్నారా?—ఇంతగా డబ్బు సంపాయించేవారు దానిని సరియైన రీతిలో తృప్తికరమైన ఉపయోగానికి తీసుకురాగలుగుతున్నారా?—ఇదే సంశయం.

ఈ లోకంలో ప్రతి మానవుడికీ కోరికలు తీర్చుకోవటానికి ధనం అవసరమైవుంది. ఆ కోరికలు న్యాయమైనవిగా ఉండాలిగాని, గొంతెమ్మకోరికలైతే ప్రయోజనంలేదు. అందుకనే న్యాయమైన కోరికలు అన్నాను. ఎవరి తాహాతుకు తగిన కోరికలు వారు నెరవేర్చుకోటానికి యుక్తమైన సాధనాలవల్ల ధనం సంపాయించటం ప్రతివారికీ ధర్మమే. కాని, ఇంతకుముందు

చెప్పినట్లుగా జీవితంలో దేని యొక్క దానికే తగిన ప్రాధాన్య మిస్తుంటాడు అతడు సుఖి. అలాగే — లోకంలో ఇప్పుడు సామాన్యంగా జరుగుతున్నదే ఇది!

డబ్బు లేకపోవటాన్నే దారిద్ర్యం అంటున్నాము. చాలా మంది జనులకు దారిద్ర్యమనేది ఒక పిశాచిలాగా భయంకరంగా అగుపిస్తుంది. కాని, నిజానికి అది అలా కనిపించినంతటి భీకర మైనదికాదు. అయితే, దారిద్ర్యబాధ ఎక్కడ ఉన్నదీ? అని ప్రశ్న. దానికి సూక్ష్మమైన జవాబు ఇది:

దారిద్ర్యబాధకే కాదు, అన్ని బాధలకూ మూలం అర్థ సంతుష్టుగా నటించ జూడటమే గాని, అర్థ హీనత కాదు. 'నిజమైన విత్తం స్వాంతంలో ఉన్నదిగాని సుదిలో లేదు.' కనుక, మానవుడు చేయవలసింది యేమిటీ అంటే —

విత్తవంతుడను అని విర్రవీగరాదు. సిరి లేనివాడనైతినే అని సిగ్గు చెందకూడదు. ఇంకా ప్రతివాడికీ చేతిలో పని. అలా చేయక, బాధపడిన పక్షమందు, అదంతా స్వయంకృతాపరాధమే కాని, ఇతరులను దూషించుటంలో అర్థంలేదు.

మానవునికి దుఃఖాన్ని కలిగించే దుష్ప్రవృత్తులూ, చెడుగులూ కొన్ని వున్నాయి. కామం, క్రోధం, లోభం, గర్వం, అతిగా వుండే అనురాగం — ఈ మొదలైనవన్నీ మనిషికి అసౌఖ్యాన్ని తెచ్చిపెట్టేవే. మానవుడికి దృఢమైన సంకల్పమే ఉన్నట్టయితే, పైనచెప్పిన చిత్తవికారాలన్నింటినీ అణచివేసి, అభివృద్ధి పొంది, తనను సుఖవంతునిగా చేసికోగలడు.

అది ఎట్లాగా? అని ప్రశ్న. మనలో విజృంభించే దుష్ప్రవృత్తులకు మారుగా సత్ప్రేమ, సహృదయత్వం, ధైర్యం, ఉదారమైన వాంఛలు మొదలైన మంచి లక్షణాలనూ, వివేకాన్నీ సంపాదించుకొని, అభ్యసించటంవల్ల ఇది సాధ్యపడుతుంది. కనుక, ఈ అభ్యాసం ఎంత శీఘ్రంగా చేసుకొంటే, మనకు అంత మంచిది. మనకే కాదు—మన బంధువులకూ మిత్రులకూకూడా మంచిది.

ఈవిషయమే మరికొంచెం విపులంగా చెబుతా—సౌఖ్యం అనేది దేహంతో కంటే, మనస్సుతో ఎక్కువగా సంబంధించి వున్నది. కాబట్టి, సౌఖ్యం అనేదానిని మనలోనే కనుక్కోవాలి. మనలోపల దానిని కనుక్కోవటం కష్టసాధ్యమే. కాని, ఇంకొక చోట దానిని కనుక్కోవటం కేవలం అసాధ్యమే అవుతుందికదా?

మనిషికి మనస్సు చాలా ముఖ్యమయింది. నరకాన్నీ స్వర్గాన్నీ మనస్సే పుట్టిస్తున్నది.

'స్వర్గం నరకం అన్నవి
ఒక స్థితికే రెండు పేర్లు
శోకస్ ఖేదం అంతే
లోకస్ రెండిటి కొకటే'

—అంటాడు శ్రీ. శ్రీ. మానవునిలో మంచినీ, చెడ్డనీ మనస్సే సృష్టిస్తున్నది. అందుకనే మనస్సుని కట్టేసుకోవటానికని మహర్షులు సైతం ముక్కు మూసుకుని తలకిందుగా తపస్సు చేస్తూ వుంటారు.

అంటామే గాని, మనస్సును లొంగదీసుకోవటం అంత తేలికయిన పని కాదు. అది ఒక పట్టాన లొంగదు. అందుకనే అను

భక్తులు 'మనస్సు పిచ్చికోతిలాంటి'దని పోల్చిచెబుతారు. అటువంటిమనస్సునే, మనం ఎలా ఐనా శ్రమపడి లొంగదీసుకోవటానికి ప్రయత్నించాలి.

మనస్సును లొంగదీసుకోవాలంటే ముందుగా జిహ్వ కట్టుకోవాలి. స్వాభావికమైన ఆహారపదార్థాలు మితంగా తింటే మనస్సూ మనస్సుకి లోబడిన ఇంద్రియాలూ, ఇంద్రియాలనుండి జనించే వాంఛలూ—ఇన్నీ మన వశంలో వుంటాయి, అందువల్ల మన ప్రవర్తన యుక్తంగా వుంటుంది. ఆత్మ నిర్మలంగా వుంటుంది.

మనోనిగ్రహాన్ని గురించి మరి రెండు మాటలు చెబుతా: కామం, క్రోధం మొదలైన మనోవికారా లున్నచోట సౌఖ్యం ఉండనేవుండదు. కనుక, అటువంటివాటికి తావీయకు.

చేయదలచుకొన్న పని సంతోషంతో ఇష్టపూర్వకంగా చెయ్యి; బలవంతబ్రాహ్మణార్థంగా ఉండకూడదు. అనవసరంగా దెబ్బలాటలోకి దిగకు. ఇంపుగా మాటలాడటం నేర్చుకో.

'అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ!'

అనే మహావాక్యం మరిచిపోకు. ఇతరులను ప్రేమించు. వాళ్ల ప్రేమను చూరగొను. ఇదే మహత్తరమైన సౌఖ్యాన్నిచ్చే ప్రేమ సూత్రం.

ధైర్యవంతుడు జీవితంలో ఒక్కసారే చిరునవ్వుతో మరణిస్తాడు, పిరికివాడు రోజూ చస్తూనేవుంటాడు అని అన్నాడు ఒక మహాకవి. దీని అంతరార్థం తెలుసుకో.

మానవుడు తనకు తానయి సుశిక్షణలో పెట్టుకోవాలె. అదే సమస్తమైన సౌఖ్యాలకూ మూలకింపం. పరిపక్వమైన మనస్సు కలవాడు ఎటువంటి పరిస్థితులలోనైనా సరే సుఖంగా ఉండ గలడు. పరిపక్వంకాని మనస్సు కలవాడు సుఖావస్థలలో ఉన్నప్పటికీ అసంతుష్టుడుగానే వుంటాడు. అలా ఎప్పుడూ మూల్గుతూనే వుంటాడు.

చెప్పానుగా, మనస్సు మహాచెడ్డది అని. మన స్వాధీనంలో అది ఉండటానికి వప్పుకోదు. తీర్చటానికి శక్యంకాని కోరికలు అస్తమానం అమితంగా కోరుతూవుంటుంది. మనస్సు కోరే కోరికలన్నిటినీ మనం తీర్చటానికి పూనుకోకూడదు. అలా చేయటం దుఃఖానికి కారణమవుతుంది.

విస్తారంగా పొలాలూ పుత్రులూ సంపాదించటంవల్లా ఏవో గొప్పపనులు చేసి ఘనత గడించటంవల్లా సుఖం వస్తుందను కొంటారు చాలామంది. పొరపాటు. చిన్నఉపకారాలు, చల్లని మాటలు, చక్కటి మర్యాదలు—ఇటువంటి అల్పమైన సుకృతాల చేతనే నిజమైన సుఖం లభిస్తుంది. స్వార్థంలేని సంఘసేవ చేయటం వల్లా, ఆత్మకు సంతోషకరమైన పనులు చెయటంవల్లా, మంచి వానియందూ మనోజ్ఞమైన వానియందూ ప్రీతి కలిగి ఉండటం వల్లా సౌఖ్యం లభిస్తుంది.

అల్పమూల్యమైన ఆహారపదార్థాలు ఆరోగ్యాన్ని ఇస్తవి సరళములైన రుచులు సౌందర్యాన్ని ఇస్తవి. అలానే డంబము లేని నడవడి సౌఖ్యాన్ని ఇస్తుంది. మనకు మేలు కూర్చే ప్రకృతి

శాసనాలకు ఉల్లంఘించినామో, శరీరసంబంధమైన బాధయినా కలుగుతుంది; నీతిసంబంధమైన నష్టమైనా కలుగుతుంది; లేదా, ఆత్మసంబంధమయిన అవస్థమైనా కలిగితీరుతుంది.

దంభమూ, ఆడంబరమూ స్వాస్థ్యానికి పరమశత్రువులు. అమాయకత్వమే మిత్రము. ఈ మాటలు రుజువుచేయటానికి చక్కటి కథలు రెండు చెబుతా:—

ఒకప్పుడు చంద్రగుప్త మహారాజుకు ఏదో తొందరపని వచ్చింది. మామూలుకంటె ముందుగా రమ్మని మంత్రులలో ఒకరికి కబురంపాడు. ఆ వెళ్ళిన దూత మహారాజు ఎందుకు రమ్మన్నాడో మంత్రితో సరిగా చెప్పలేక పోయాడు.

అందుచేత మంత్రి "అబ్బాయీ!-నాకాలం సద్వినియోగం చేసికొనటానికి ఇది మంచి మార్గమని చెప్పి నేను రాజుగారిని సేవిస్తున్నాను కాని, స్వప్రయోజనంకోసం కాదు. నిజంగా తగినంత ఆవశ్యకత ఏదైనా ఉంటే నేతప్ప నేనిప్పుడు రాజుగారివద్దకు వెళ్ళి నా కాలాన్ని వ్యర్థం చేయను" అని బదులు చెప్పి, వానివెంట వెళ్ళటం మానివేశాడు.

ఆ దూత 'ఏమిటీ ఈయన సాహసం!— రాజాజ్ఞనే ధిక్కరిస్తున్నాడే!!' అని ఆశ్చర్యపడ్డాడు. కొంచెంసేపు అలానే కని పెట్టివున్నాడు. చూడగా — మంత్రి తనపాత్రలు తనే స్వయంగా శుభ్రంచేసికొని, స్వయంగా వండుకోవటం కనిపించింది. అప్పుడు కారణం గ్రహించగలిగాడు ఆ దూత. 'ఆహా!— ఇటువంటి నిగర్వ చూడామణి మహారాజులనైనా లక్ష్యపెట్టక పోవటంలో

వింత రోగమున్నది!' అనుకొని నిజం తెలుసుకొన్నాడు. నిరాడంబర జీవనం చేసేవాడు రాజుల అనుగ్రహంకోసం ఆపేక్ష పడడు. తక్కిన వారిలాగా నీచంగా చేతులు నలుపుకొంటూ ఆశ్రయించడు.

సుప్రసిద్ధుడైన నీతిజ్ఞుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఒకప్పుడు 'పొడిరొట్టె తిని నేను ఉండగలిగినంత కాలమూ ఈ ప్రపంచంలో ఎవరి అనుగ్రహమూ నా కక్కరలేదు' అన్నాడు.— ఈ మాటలలో ఉండే అంతరార్థం మనం తెలుసుకోవాలి.

మానవుని అసౌఖ్యానికి కారణం ఇంకొకటి వున్నది. ఇది చాలా పెద్దకారణం. ఇదే ఖ్యాతికోసం ప్రాకులాట. ప్రతివాడూ లోకంలో పేరుకోసం తాపత్రయపడుతూ వుంటాం. మనం చేసే ప్రతీ పనిలోనూ మన్ని గురించి ప్రజ ఏమనుకొంటున్నారో, ఏమనుకొంటున్నారో...అని ఇలా అనుకొని, ప్రజాభిప్రాయానికి అతి ప్రాధాన్యమీయటం వింతగాక మరేమిటి!—

ధనంసంపాదించటానికీ, లాభకరమైన ఉద్యోగం సంపాదించటానికి, విద్య సంపాదించటానికీ ప్రజలు పడరాని పాట్లు పడతారు. ఐతే—ఇదంతా చాలావరకు ఇతరుల దృష్టిలో వాళ్లు గొప్పగా కనబడటానికే!! మరొక ఉద్దేశంతో కాదు.

ఇతరులు తమని చూచి పేదవాళ్లనుకుంటారేమోననే భీతి చేతనే ప్రజలు పెద్దపెద్ద యిళ్లు కట్టుకొంటున్నారు. మంచిమంచి దుస్తులు ధరిస్తున్నారు. వైభవంతో సంసారం సాగిస్తున్నారు!!!
—ఇతరులు తమని చూచి, అనాకారు లనుకొంటారేమోననే

భయంచేతనే కొందరు క్షేమపడక్లు మొదలైనవి వాడి, పోకు చేసుకొంటున్నారు. నిజానికి ఇదంతా మోసంకాదా?

కొంచెం నిదానించి ఆలోచించుకొన్నట్టయితే — ఎవరిని ఇంతగా మనం లక్ష్యం చేస్తున్నామో, ఎవరిని చూచి బెదిరి పోతున్నామో, ఆ ప్రజలు మనల్ని రవంతయినా లక్ష్యంచేసి, మనల్ని గురించి కాస్తంతైనా తలచరని స్పష్టపడుతూంది. చచ్చి, గోతిలో పారవేయబడిన కుక్కకంటె వారికి మన ఎక్కువ ఏమీ లేదు. ఇంకెందుకు!—మానవుడు చనిపోయినప్పుడు బంధువులూ స్నేహితులూ అయినా ఏమిచేస్తారు?—వానిని పాతిపెట్టి యింటికి వచ్చి వాని సంగతే మరచిపోతారు. వాడు పోతే మరొకడు వచ్చి ఆ స్థానం ఆక్రమించుకొంటాడు! ప్రపంచవ్యవహారాలు యథా ప్రకారం సాగిపోతూనేవుంటాయి.

ఇటువంటి స్థితిలో దుఃఖానికి దూరంగా ఉండాలంటే ఉత్తమమైన మార్గమేది? ఒక్కటే మార్గం: ఇతరుల అభిప్రాయాన్ని లెక్కచేయకు. నీకు మంచిదని తోచిన పని చెయ్యి. ఇదే క్షేమంకరమైన జీవనసూత్రం. ఈ సూత్రాన్ని అవలంబిస్తే సుఖపడతావు. లేనినాడు నీ అసౌఖ్యానికి నీవే కర్త వవుతున్నావన్నమాట. అటువంటప్పుడు నిన్ను నీవే నిందించుకోవాలె కాని, ఇతరులను నెపపెట్టకూడదు.

కొంతమందిని చూచి, 'వారికేమయ్యా, అదృష్టవంతులు!' అని అనుకొంటాము. ముఖ్యంగా రాజులు, ప్రభువులు, ధన వంతులు—వీరిని చూచినప్పుడు మనకి అటువంటి ఉద్దేశం వెంటనే

కలుగుతుంది. కాని పాపం!— వారుకూడా ఎప్పుడో ఒకప్పుడు 'మేమూ కష్టజీవులమే' అని పలవరిస్తారు. కాని, మానరు. ఒక్క మాటలో చెప్పాలనంటే ఎవరి చిక్కులు వారివి.

పైకి వారు సుఖంగా కనపడుతున్నారని మన మనుకొంటాము. మనకి వింతగానే తోచవచ్చుగాని, వారికి వుండే చిత్తక్షోభలూ చిక్కులూ వారికి వుంటాయి.

సంతతి లేనివారు కొందరూ, నిత్యరోగపీడితులుకొందరూ బిడ్డలతో పడలేనివారు కొందరూ, బంధువులతో సరిపడనివారు కొందరూ—ఇలా వారు ఏదో వక బాధకు లోనవుతూనే వుంటారు. సంపత్తు పోయినప్పుడు వారు పడే కష్టాలు మరీ అబ్బురంగా వుంటాయి.

ఒకానొకప్పుడు హఠాత్తుగా ఐశ్వర్యం, నష్టంకావడం సంభవింపవచ్చు. అటువంటప్పుడు దెబ్బకు తట్టుకోలేక వారు భ్రష్టమతులైపోవచ్చు. ఇందుకొక తార్కాణం: ఇంగ్లండుదేశపు రాజయిన మొదటి ఛార్లెస్ సింహాసన భ్రష్టుడు కానున్నప్పుడు ఆయన తలవెంట్రుకలు ఒక్కరాత్రిలో తెల్లపడినవని చెప్పుకొంటారు.

అలాటి ఆపదసమయాలలో చేయవలసింది ఏమిటి?— మన ఐశ్వర్యాలను గురించిగాని, సుఖపరిస్థితులను గురించిగాని తలపోయక, ఆ సుఖాలన్నిటినీ, మనకి ప్రసాదించిన ఆ భగవంతునిపైనే లగ్నం చేయాలి. అనగా, ఏది తథ్యము, ఏది మిథ్య అనే యథార్థజ్ఞానాన్ని సంపాదించుకోవాలన్న మాట.

ఏదో ఒకహాసకోసం పేరాసు పెట్టుకొని ఉండటంవల్ల మనుష్యులకు ఆరోగ్యం కలుగుతున్నది. మన ప్రయత్నాలకు ఫలితంగా మనకు లభించినదానితో తృప్తి పడటంవల్ల సౌఖ్యమూ, శ్రేయస్సూకూడా చేకూరటం ప్రతినిత్యమూ మనకి అనుభవం లోని విషయమే!

కనక, మన కష్టాల్ని గురించి తక్కువగా చింతిస్తూ, జీవితంలో ముఖ్యములైన సుఖవిషయాలను గురించే ఎక్కువగా తలపోయటం మనం ఎందుకు అలవాటు చేసికోకూడదు?——

అటువంటి అలవాటు మనం చేసే పనులకు తోడ్పాటుగా వుంటుంది. అంతేకాదు. అప్రియాలను ప్రియాలుగా మారుస్తుంది. ఇష్టంలేని వ్యాపారాలవల్ల కలిగే ఆయాసక్లేశాలను తొలగిస్తుంది. జీవితంలో కలిగే సంక్షోభాలను ఉపశమింపజేస్తుంది. ఇందువల్ల మనకి ధనంకంటె ఎన్నోరెట్లు ఉపయోగం కలుగుతుంది. కష్టాల్ని సుఖంగా దాటడానికి గల మార్గాలలో ఇదే ఉత్తమమయింది.

మరొక విషయం: ఫలానా పని తలపెట్టాము, మన ప్రయత్నం విఫలమయిపోయిందే, ఆశాభంగం కలిగిందే అని అనేకమంది ఏడుస్తూవుంటారు! ఈ అనర్థం అహితంగానే వుంటుంది. ఐతే, ఆ అహితంతోపాటు మేలుచేసే ప్రకృతికూడా కొంతవున్నది. అటువంటి ఆశాభంగాలు మన అనుభవాన్ని పరిపక్వదశకు తెస్తాయి. అవి మనం ముందు జీవితాన్ని గురించి అతిజాగరూకతతో ఉండ

టానికి ఎక్కించే నిచ్చెన మెట్లు అని చెప్పవచ్చు. అందువల్ల వచ్చే అనుభవంకంటె ఇవి మనకి ఎక్కువ ఉపకరిస్తాయి.

ఈ లోకంలో అటువంటి కష్టాలు—మనకి అహితంగా కనబడినప్పటికీ—నిజంగా హితమైనవే. అవి మనకి ఉత్తమోత్తమములైన గురువులు. వాటిద్వారా జీవితంలో మనం జయమైన మార్గంకంటె, సుఖమైన మార్గంకంటె కూడా ఎక్కువ నేర్చుకోగలుగుతాం. మానవుడికి జీవితంలో కష్టాలే లేనిపక్షమందు అభివృద్ధే ఉండదు.

ఏది ఎలా వున్నప్పటికీ, వివేకి ఐనవాడు తనకు తటస్థించే కష్టాల్ని ఎంత స్వలాభకరంగా ఉపయోగించగలడో, అంతా ఉపయోగించుకొంటాడు. ఆకాశానికి నిచ్చెనలువేసి, 'నా కివి లేవు అవి లేవు' అని మనస్సు క్షోభపెట్టుకొనక; కలిగినదానితో తృప్తి పడి సుఖపడు.

ఇంతవరకూ బాగానే వుంది. ఐతే—చెడిన ఆరోగ్యం కుదుర్చుకోవటం, మందబుద్ధిని వికసింపజేసికోవటం, మంచి వృత్తులను సంపాదించుకోవటం, తమతమ వ్యాపారాలను చక్కగా నిర్వహించుకొనే శక్తి గడించుకోవటం—ఇదంతా ఒకటి రెండు రోజులలో అయేపని కాదుగదా!—

అందుకని, మీరొక ప్రశ్న వేయవచ్చు: "పైన చెప్పిన వాటిలో అన్నిటిలోనో, కొన్నిటిలోనో కొరతపడినవాడు ఏం చేయాలి?— అటువంటివాడు తన అదృష్టంకొద్దీ లభ్యమైన వాటితో తృప్తి పడవలసిందేనా?— మరి మెల్లిమెల్లిగా ఆ

లోపాలన్నీ కూడదీసికొనే టంతవరకూ అసౌఖ్యంగా ఉండవల సిందేనా?— సుఖపడటానికి ఏదైనా వేరే మార్గమున్నదా?" అని ఇలా అడగటం న్యాయమే.

లోపాలున్నవారు అవి చక్కబడే టంతవరకూ ఎంత మాత్రమూ కనిపెట్టుకుని ఉండనక్కరలేదు. భగవంతుని కృప చేత ప్రతీవాడికీ ప్రత్యాశ అనేది ఒకటున్నది. సుఖంగా ఉండాలి అని కృతనిశ్చయుడైన ప్రతివాడూ సుఖపడగలడు. ఎలాగ?— దయామయుడైన దేవుడు మానవులకు కొన్ని కొన్ని దివ్యమైన లక్షణాలను ప్రసాదించాడు. వాటిని మనం వినియోగించుకో గలిగిననాడు కొద్ది శ్రమతో సౌఖ్యాన్ని సంపాదించుకో గలుగు తాం.

ఆ దివ్యలక్షణాలు ఏమిటీ అంటే —సంగీతమంటే అభిరుచి. తృప్తి. అంతా సరిగానే వుంది, అంతా మన మేలుకే వస్తుంది' అనే గట్టి విశ్వాసంవల్లకలిగే చిత్తప్రసాదం. స్థితిగతులు ఎలా వున్నప్ప టికీ, ఈ లక్షణాలు కలవాడు నిశ్చయంగా ఎల్లప్పుడూ సంతుష్ట చిత్తంతో ఉండగలడు.

సంగీతం అమూల్యమైన సుఖ సాధనం. మనసులోని గా యాల్ని మాన్పటానికి అది ఒక దివ్యౌషధం అని చెప్పవచ్చు. మనసు వ్యాకులంగా ఉన్న వారిని తృప్తాత్ములుగానూ, ఉల్లాసవంతు లుగానూ చేయగలదు. దాని సంపర్కం గల అన్నిటిపైనా తన ప్రభావాన్ని అత్యద్భుతంగా అగపరుస్తుంది.

పాశ్చత్యపురాణాల్లో చిత్రమైన చిన్న విషయం ఒకటున్నది: ఆర్ఫియస్ అనే అతడు గానం చేసినప్పుడు ప్రవహిస్తూవున్న నదులు ఆగి, అతని పాట వింటూ ఉండేవట! సింహం మొదలైన క్రూరమృగాలు ఒక పక్కనీ, ఆవులు ఒక పక్కనీ పూర్ణంగా పరవశత్వంచెంది, తమ కుండే సహజ వైరాలు మరచిపోయి, అలానే నిలుచుండి అతని మధురగానం ఆలిస్తూఉండేవట !!

సంగీతమనేది ఉభయ శ్రేయస్కరమయిన దివ్యానంద ప్రదాయి. ఎందుకంటే, అది పాడేవారినీ వినేవారినికూడా పరమ సంతోష భరితుల్ని చేస్తుంది. పోయిన ఉత్సాహాన్ని అది హృదయానికి మళ్లీ తీసుకవస్తుంది; చెదరిన మనస్సును శాంతపరుస్తుంది; వీనులకు విందు కానిస్తుంది.

రోజంతా కష్టపడి పనిచేసినవారికి వినోదరూపంలో విశ్రాంతి, సుఖం ఇచ్చేవాటిలో సంగీతం ఉత్తమమయింది. వ్యాపారక్లేశంచేత మనస్సుకు అంటిన దుమ్మూ, ధూళీ తుడిచివేసి, అది సాత్వికములైన భావాలతో మనసును నింపుతుంది. సంగీతం ఎంత మధురంగా చెవులలో చొచ్చినట్టయితే, సత్యం అంత నిజంగా స్వచ్ఛంగా హృదయంలోకి ప్రవహిస్తుంది.

మన పుణ్యమా అని, సంగీతం వ్యయాత్మకమైంది కాదు. దమ్మిడీ ఖర్చు అవసరంలేకుండా దానిని అనుభవింప గలము. కనుక, ఇటువంటి ప్రశస్తమైన కళను సంపాదించుకోనటం చాలా మంచిది.

రోజూ ఉదయానే తంబురవంటి తంత్రీ వాద్యం ఏదైనా సుతిచేసికొని, అధమం ఒక అరగంట సేపైనా ఉత్సాహాకరమైనటు

వంటీ, ఉల్లాసకరమైనటువంటీ చక్కటి కీర్తనలు నియమంగా పాడు కోవటం ఎంతైనా శ్రేయస్కరం.

'కష్టకాలంలో గానం చేయడ మెలాగయ్యా?' అని కొంద రనుకొంటూరు కాని, అది అనుకొన్నంత కష్టమైన పనికాదు. అభ్యాసమయ్యేవరకూ ముందు మంచి గీతాలను గట్టి పట్టుదలతో గానం చేయటం నేర్చుకోవాలె.

అలా చేసినపక్షమందు అవి క్రమంగా మన నిత్య కృత్యా లలో చేరి, అన్ని సమయాలయందూ — ముఖ్యంగా ఆపత్సమ యాలయందు — మనం పాడుకోవటానికి ఉపయోగిస్తాయి. ఇది తప్పకుండా అతి లాభకారి ఐన పద్ధతి.

పరిహాసాస్పదములైనవి, ఉపేక్షించ తగినవీ, ముక్యా మూలం లేనివీ అయిన అనేక కష్టాలనూ బాధలనూ పోగొట్టు తుంది. అలాటి బాధలు సంగీతపు ధాటికు ఎంతమాత్రం నిలవ జాలవు.

సర్వమూ మనకి ప్రతికూలమై ఉన్నప్పుడూ, అన్నీ ఎదురు తిరిగి ప్రతి విషయంలోనూ మనకి అడ్డు వస్తున్నప్పుడూ, అప్పుడే మన పౌరుషాన్నీ, ప్రభావాన్నీ వ్యక్తం చేయాలి. మన ప్రకృతి అజేయమైనదనీ, ప్రపంచంలో ఏదీ మనల్ని ఓడించలేదనీ రుజువు చేయాలి — అలా చేసి, ఆధిపిశాచాలన్నిటినీ ఉచ్చాటనం చేయ టానికి సంగీతమే గొప్పమంత్రం. దీనికంటె సమర్థతరమైన సాధనం మరొకటి లేదు.

మనసులోని విచారాలు తొలగించే మార్గం ఒకటి వున్నది! మన బాధలనూ కష్టాలనూ చూచి నవ్వుకోవటం! ఇందుకోసమే అన్ని స్థితులలోనూ మందహాసంతో ఉండటం అలవాటు చేసుకోవాలె.

చిరునవ్వుతో ఉండే స్వభావం కలవాడికి [illegible] వానిలాగానే అందరూ స్వాగతమిస్తారు. అతని శరీరం బాగా వుంటుంది. 'సంతోషం సగం బలం.' అన్ని కార్యాలయందూ అతడు విజయి అవుతాడు.

నవ్వుమొగంవానికి ఇతరుల స్నేహం ఎక్కువగా వుంటుంది. చింతా, శంకలు ఉండవు. జీవితంలోని ఆయాసము, శ్రమ అతని మనసుకి అంటవు. ఏపని ఐనా నిర్వహించటంలో ఇతరులకంటె అతనికి రెండు రెట్లు మూడు రెట్లు సమగ్రత ఉంటుంది.

చిత్త ప్రసన్నత పోయేవరకూ ఎవరి కృషీ విఫలం కాదు. కాబట్టి, నగుమోము మాటున నీ బాధలన్నీ మరుగుపరుచుకోవటం నేర్చుకో. చిరునవ్వుతో నీ మిత్రులకు ఎదురువెళ్ళటం, ప్రతి పనీ కలకలలాడే మొహంతో చేయటం అభ్యాసం చేసుకో. చేస్తే సంతతం నువ్వు చిరునవ్వు నవ్వుతూ ఉంటావు. అది కొంతసేపయినా నిన్ను ఆనందమైన మనస్సుతో ఉంచుతుంది.

హృదయపూర్వకమైనట్టువంటి నవ్వు మనస్సుకీ, శరీరానికీ కూడా బలవర్ధకమైన, ఆయుర్వృద్ధికరమైన పరమౌషధం. ఇది సర్వధాతువులకూ ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ఈ అలవాటు అన్ని విధాలా అభ్యసించ తగింది.

సంగీతంబాగానే మొదట్లో ఈ మంచి అభ్యాసం కూడా కష్టంగానే కనిపిస్తుంది. కాని, మనం చేసే ప్రతిపనీ సంతోషంతో చేయటం, ఆ చేసిన పనినుంచి అంతోయింతో ఆనందాన్ని పొందటం అలవాటు చేసికొంటే ఇది చాలా సులువనిపిస్తుంది.

చింతలను పారదోలే మార్గాంతరం మంచి పుస్తకాలు చదువుకొంటూ వుండటం. చాలామంది తమ జీవితంలో కొంత కాలం మహానందాన్ని అనుభవింపగలగటం ఈ అభ్యాసంవల్లనే! చేయటానికి విశేషించి ఏ పనీ లేనప్పుడు సత్కాలక్షేపానికి మంచి పుస్తకాలు చదవటం కంటె మంచిమార్గ మేదీ లేదు. మంచి పుస్తకాలు చదవటంవల్ల మనకి కలిగే ప్రత్యక్షలాభాలు రెండు: ఆనందమూ పొందుతాము, జ్ఞానాభివృద్ధీ కలుగుతుంది.

ప్రోత్సాహకరములైన ఉపన్యాసాలిచ్చే ప్రదేశాలకూ, ప్రశస్తమైన ఉపదేశ వాక్యాలు వినిపించే చోటులకూ వెళ్లటం కూడా ఆ విషయంలో మనకి మిక్కిలి సహకారులవుతవి. అవిన్నీ మన దుఃఖాలను సుఖాలుగా మార్చగలవు.

ఇటువంటివి ఏవీ చేయటానికి శక్యంకాని సమయాలలో కాలానుకూలాన్ని బట్టి వేగంగా నడుస్తూ తెరపిగా వుండే. ప్రదేశాలకు షికారువెళ్లి, దర్శనీయములైన వస్తువులు చూస్తూ, శ్రావ్యములైన పక్షికూతలు వింటూ ఆనందించు. వంటికీ ముఖానికీ చల్లని పిల్లవాయువు తగిలితే ఎంత హాయిగా వుంటుంది!

పాదచారి వై ఉదయాన్నగాని, రాత్రి వెన్నెలలో గాని హరించటం, ఉదయించుతూ వున్న సూర్యునకో అమిస్తమించు

తూవున్న సూర్యునకో అభిముఖంగాగాని నడిచిపోవటం— ఇవి బాహ్యప్రకృతి సుగుణమైన చిత్తవృత్తిని మనలో కలిగించి, మనల్ని ఆనందమయులను చేస్తవి. ఇవి చూడటానికి సామాన్యమైన స్వల్పసాధనాలే కాని, అత్యద్భుతాలైన ఫలితాలని స్తవి.

చింతలను చెదరగొట్టగల సాధనం ఇంకొకటి ఉన్నది: తాత్కాలికంగా నిన్ను నీవు పూర్తిగా మరిచేటట్టు చేయగల ఏదో ఒక యిష్టమైన వ్యాపారంలో నిమగ్నుడవై ఉండటం. దీనినే ఇంగ్లీషులో 'హాబీ' అంటారు. జీవితంలో కూటికోసమూ, గుడ్డ కోసమే కాదు, కేవల వినోదార్థం పనిచేయటానికి ఏదో ఒక వ్యాపారమందు గాఢమైన అభిలాష కలిగి ఉండటం మంచిది.

గొప్పవారి చరిత్రలు చదివినట్టయితే, అందులో చాలా మందికి అటువంటి అలవాట్లు ఒకటో రెండో ఉన్నట్టు అగపడుతుంది. వారికి ఈ 'హాబీల' పైన ఉండే పిచ్చివ్యామోహం చూచినట్టయితే, అవి వారి శరీరమంతటినీ ఆక్రమించి ప్రతి ధాతువులోనూ దూరి వ్యాపించి వున్నవా ? అని మనకి భ్రాంతి కలగక మానదు. ఎవరికి ప్రియమైన వ్యాపారంలో వారు ప్రవేశించి పనిచేయటం ఎంతో సంతోషకరంగా వుంటుంది.

అలా పని చేసేవాడు తన మనస్తాపాలన్నీ మరచిపోతాడు; మనసంతా పనిమీదనే పెట్టి, సంతోషంతోనూ ఉత్సాహంతోనూ చేయటంవల్ల, మన మహా కష్టాలన్నీ కొండి విరిగిన తేళ్లలాగా నిర్బాధకములై పోతవి. మనస్సులో పుట్టిన చింతల నుండీ, దుఃఖాలనుండీ మనల్ని రక్షిస్తవి.

ఒళ్లు మరచి ముమ్మరంగా యుద్ధం చేస్తూవుండే యోధు డికి గాయం తగిలినట్టే కనబడదు. ఝరీవేగంతో ఉపన్యాసం ఇస్తున్న మహావక్తకు తన కీళ్లవాతపు నొప్పుల మాట తలపునకే రాదు. ప్రియవ్యాపారమనే భూతం పూర్తిగా ఉన్నవారిలో మరిపక చింతాపిశాచం చొరుచుకోవటానికి సందే వుండదు.

ఇటువంటి ఇష్టవ్యాపారానికి సంబంధించిన అభినివేశం మన ఉద్దేశాలపైన పనిచేసి, మనం చేసే పనులకు వన్నె పెట్టి, మన అదృష్టాన్ని నిర్ణయించి నిరూపిస్తుంది. అది మనల్ని అభివృద్ధికి తీసుకు రావటమే గాక మనకి మిక్కిలి చౌక ఐనటువంటీ, అతి ఉత్తమ మైనటువంటీ వినోదసాధనం కూడా అవుతుంది.

నిజానికి సదా వ్యాపారంలో మునిగివున్నవానికి కన్నీళ్లు విడవటానికి సందే వుండదు. అట్టి శోకానికి అవసరమే వచ్చే యెడల, వ్యాపారమగ్నత దుఃఖమనే విషానికి విరుగుడుగా పని చేస్తుంది. పనిలో ఉన్న మనస్సుకి పరితుష్టి అప్పుడే వుంటుంది!

చిక్కులు కలిగినప్పుడు సుఖమనస్కుడై ఉండటానికి ఇంకొక ఉపాయమున్నది. అది ఏదీ అంటే— అభివృద్ధికోసం మనసారా సాధ్యమైన యత్నాలన్నీ చేసిన తరువాత, లభించిన దానితో తృప్తి పడి ఉండటం. 'మేమీ దుఃఖాలు భరించలేము బాబోయ్!' అని ఏడిస్తే లాభంలేదు. అలా యేడవటంవల్ల ఉన్న దుఃఖం మరింత హెచ్చవుతుందే కాని, కొంచెం కూడా ఉప శాంతి కాదు. మరి ఏ విధంగానూ లాభలేశమైనా కలగదు.

అలా చేయటానికి మారుగా ఆర్తుడై ఉన్నవాడు తన చుట్టుపట్ల ఉండేవారి స్థితిగతులు పరిశీలించి చూచుకోవాలి. చూచుకొన్నట్టయితే, తన జీవనస్థితి ఎంత దిక్కుమాలిన కష్టస్థితిగా ఉన్నప్పటికీ, ఇతరు లనేకులకంటె తనే ఎక్కువ సుఖస్థితిలో ఉన్నట్టు తోస్తుంది. కనుక ఏ స్థితిలో ఉన్నప్పటికీ, మనం సుఖించి, భగవంతుడికి కృతజ్ఞులమై ఉండకపోవటానికి కారణం కనిపించదు.

గ్రీసుదేశపు తత్వజ్ఞుడైన సొక్రటీసు ఈ సందర్భంలో ఏం చెప్పాడో తెలుసా?— 'లోకంలో ఉంటున్న కష్టాలన్నీ కలిపి ఒక చోట పోగుచేసి, మనుష్యుల కందరికీ అవి సమంగా పంచి పెట్టినట్టయితే, అలా విభాగం చేయటంవల్ల తమ పాలికి వచ్చే కష్టాలకంటె తమకు ప్రస్తుతం ఉంటున్న కష్టాలు భరించటమే సుకర మని వప్పు కొంటారు.'— ఇదీ ఆయన అభిప్రాయం.

అన్నిటికంటె ముఖ్యంగా, ఉత్సాహాన్ని చెదర గొట్టే పిరికి ఊహలు ఎన్నడూ మనసులో చొరనీయకూడదు; అటువంటివి చొచ్చిన పక్షమందు— తెలియక మనం తప్పు చేశామనీ, ముందు అటువంటి భావాలతో ఎలాటి ప్రసక్తి కలగజేసుకొన మనీ అనుకొని,వాటికి బదులుగా వాస్తవికాలూ, ధైర్యాన్నీ బలాన్నీ ఇచ్చే భావాలనూ ప్రవేశపెట్టుకోవాలి.

మనల్ని గూర్చి, మన శక్తిని గూర్చి ఇతరులు ఏమనుకొంటున్నా సరే, మేము తప్ప ఇతరులు చేయలేనట్టివన్నీ, చేసినా

మేము చేసినంత బాగాచేయలేకపోయినన్నీ, ఏదో ఒక పని ఉన్నది— అని మనఃస్థైర్యంలో నొక్కి చెప్పాలి.

మనపట్ల మనకు సద్భావాలున్నట్లయితే బహుశా ఇతరులకు కూడా మన యెడల సదభిప్రాయాలు కలగవచ్చు. కాని, అటువంటి అభిప్రాయాలు బలవంతంగా మనం ఇతరులకు కలగజేయకూడదు. సుఖంగా ఉండాలి అని మనం కృతనిశ్చయులం కావాలి, మనం సుఖంగా ఉన్నట్టే భావించుకోవాలి. అలా చేసినట్లయితే కొద్దికాలంలో మనం నిజంగానే సుఖవంతులమైపోతాం.

ఉదయానే మేలుకొని లేచినప్పుడు ఏమి సంభవించినా సరే, ఇవాళ నాకు సుఖకరమైన ఉత్సవదినంగా చేసుకొంటాను! అని నీలో నీవు దృఢసంకల్పం చేసికో. కాని సరీగా నీ యిష్టప్రకారమే నీ యత్నాలు ఫలిస్తాయని మాత్రం ఆశ పెట్టుకొని ఉండకు. నీ శక్తి అంతా వినియోగపరిచి త్రికరణ శుద్ధితో పనిచేసిన తరువాత నీకు లభించిన ఫలంతో తృప్తి పడి వుండు. వాటి వల్ల నీవు పొంద గలిగిన మేలంతా పొందు.—అలా చేస్తేవంటే నీ సంసారం స్వస్థంగా శాంతంగా సాగిపోతుంది. అల్పాపేక్ష పెట్టుకొని అధికం అనుభవించటమే నిజంగా సుఖజీవనంలో ఉండే రహస్యం. సుఖజీవనానికి అగత్యమైన సాధనాలన్నీ ఇంతవరకు తెలుసుకొన్నాము. ఐతే—ఇన్నిటికీ మూలమైంది మరొకటి ఉన్నది. అదే 'వివేకం'. ఇది క్రమంలో కట్టకడపటిదయినా, ప్రాముఖ్యంలో మటుకు మొట్టమొదటిదిగా పరిగణించాలి.

ఈ దుఃఖనివారణోపాయం సర్వసామాన్యమైనది. సర్వ సామాన్యమని అంటామే కాని, ఈ తెలివి ప్రపంచంలో ఎవరికో కొందరికి, అరుదుగానే—అసామాన్యంగానే—ఉంటుంది. వస్తాయి వస్తాయి అని సాధారణంగా జనులు భయపడి విలపించే విపత్తులలో చాలవరకు రానేరావు. రానివి ఎప్పుడో వస్తాయని వాటికోసం ఎదురుచూస్తూ వుండటం ఎటువంటిది? లేని కష్టాల్ని సృష్టించుకొని, వాటికి స్వాగత మివ్వట మన్నమాట!

మహామారి, కలరా మొదలైన అంటురోగాలు వ్యాపిస్తూ ఉంటాయి. అటువంటి సమయంలో కొంతమంది, రోగంవల్ల గాక కేవలం రోగం వస్తుందనే భీతిచేతనే మరణించటం మనం ప్రత్యక్షంగా చూస్తూనే వున్నాము.

కనుక, 'కష్టాలు మనల్ని కష్టపెట్టేవరకు మనం కష్టాల్ని కదిల్చి లేపకుండా వుండటం, అవి వచ్చినప్పుడు ప్రసన్న చిత్తంతో ప్రశాంతంగా వాటిని ఎదుర్కోవటం'—ఇది మనం అవలంబించవలసిన పద్ధతులలో ప్రశస్తమైంది.

మనం తప్పించుకో గలిగినవీ, తప్పించుకోలేనివీ అని రెండు విధాలయిన కష్టాలుమాత్రమే కలవని పెద్దలు చెప్పే మాట నిజం. మొదటివి సాధ్యమైనంత శీఘ్రంగా నివారించుకొని, రెండవ రకపు కష్టాలు అనివార్యములు కాబట్టి వాటిని శాంతంగా సంతోషంతో సహించి అనుభవించాలి.

మనస్సును కలవరపెట్టే కారణం ఏదైనా కలిగినప్పుడు మనం ఇలా వితర్కించుకోవాలి: చింతలచేత క్రుంగి కుందటం

మన బాధను తగ్గించదు. కొంచెమైనా మనల్ని ఇంతకంటె మంచి స్థితికి తేలేదు. కాని, మనస్సును వికలంచేసి, ఆలోచనలను అస్త వ్యస్తం చేసి, జీవశక్తి క్షీణింపజేసి కష్టాల్ని ధీరులుగా ఎదుర్కొనే మనశ్శక్తిని మాత్రం తగ్గించగలదు. సామాన్యంగా తగ్గిస్తున్నది.

ఇదివరకే మనకొక కష్టంవచ్చింది. దానిని గురించి అస్తమానమూ ఆలోచించడమనే ఇంకొక కష్టంకూడా మనం ఎందుకు తెచ్చిపెట్టుకోవాలి? అని ఈ విధంగా ఆలోచించుకోవాలి. మనస్సులో కలిగే సంక్షోభం ఎన్నటికీ మనకి ఎలాటి మేలు గాని చేయలేదు. వివేకి ఎప్పుడూ దానికి లొంగక, అతీతుడై వుంటాడు.

ఇప్పటి వరకు చెప్పిన విషయాలను బట్టి మన దుఃఖానికి మనమే కారకులమనీ, శ్రద్ధతో కృషిచేసిన పక్షమందు ఆ దుఃఖస్థితిని సుఖస్థితిగా మార్చుకోగలమనీ విశదమవుతున్నది. ఈ సందర్భంలో మనం కృషి చేయవలసిన సాధనాలు యేమిటేమిటో మళ్ళా ఒకసారి క్లుప్తంగా చెబుతాను:

సంగీతం పాడుకొని దుఃఖాన్ని పారదోలుకో, చిక్కులలో చిరునవ్వు నవ్వుకో. అవసరమైతే, మొదట్లో బలవంతంగా తెచ్చిపెట్టుకొని అయినా సరే, కృత్రిమ మందహాసం చేయవచ్చు. సదా ఏదో ఒక వ్యాపారంలో ఉండు. కలిగినదానితో తృప్తి పొందు. అన్నిటికంటె ప్రధానమైంది—సింహధైర్యంతో దృఢ

సంకల్పం చేసికో. ఇటువంటి మరికొన్ని సాధనాలచేత దుఃఖ స్థితిని సుఖస్థితిగా మార్చుకోగలం.

వీటివల్ల లాభాలను పొందటానికి ఎంత త్వరపడి మనం పనిచేస్తే, మనకి అంతమంచిది.

'సౌఖ్యం అనేది ప్రతివారికీ, జన్మసిద్ధమైన హక్కు. కనుక, నీవు సంతోషంతో ఉండు'— ఇదే ఈ ప్రపంచంలో భగవంతుడు నీకు విధించిన విధులలో ఉదారతమమైంది. నీ ఇరుగు పొరుగుల యెడల, బంధు మిత్రాదుల యెడల, నీ యెడల, నీవు ఆచరింపవలసిన ముఖ్యధర్మం— సదా నీవు ఉల్లాసహృదయుడవై ఉండటమే! ఎప్పుడూ ఏడుపు మొగం పెట్టుకుని నిరుత్సాహుడవై ఉండటం నీ కుటుంబానికీ నీ మతానికీ నీ రాష్ట్రానికి కూడా ద్రోహం చేయటమే అవుతుంది. ఇది మనుష్యుడు చేయగల అపరాధాలలోకెల్లా మహాపరాధం. సమస్తమైన ఇతర పాపాలకూ ఇదే మూలం.

నీవు ప్రసన్న చిత్తుడవై ఉన్నట్టయితే, నీ చుట్టుపట్ల ఉండే సమస్తమూ నీకు అనుగుణంగా మారి సరిపుచ్చుకొంటుంది. సంతోషంతో ఉండేవారు మిక్కిలి సుఖవంతులు దీర్ఘాయుష్మంతులూ అవటమే గాక ఈ లోకంలో అన్ని ఉద్యమాలయందూ చరితార్థులవుతారు. ఎంతో ఉపయోగకరమైన జీవనం చేస్తారు.

సుఖజీవనం చేయటం అందరికీ శక్యమే అని ఇంతవరకూ సంగ్రహంగా చెప్పాము అయితేనేం?— జీవనంలో అలా సుఖం అనుభవించేవారు ఎక్కడోగాని కనిపించకుండా వుండటమే

విచారించవలసి ఉన్నది. ప్రపంచరీతి ఇలా ఎందుకుండాలె?— మరి, ఈ కష్టాలు గడచేది ఎలా?— ఈ విషయాలు అందరికీ కావలసినవే గనుక, అన్ని కాలములందూ విజ్ఞులూ బుద్ధిమంతులూ ఇందునుగురించి ఆలోచిస్తూనే వచ్చారు.

వారు లోతుగా విమర్శించి నిర్ధారణ చేసిన పర్యవసానం ఇది—మన అసౌఖ్యానికి గల హేతువులు ముష్వాతీక ముష్వీసం కేవలమూ మానవుడు భావనలో కల్పించుకొన్నవే. అవన్నీ సునాయాసంగా మనం నివారించుకోగలిగేవే. సరి ఐన మార్గాల్ని తెలుసుకొని వాటిని అవలంబించే యెడల చాలామందికి సుఖజీవితం గడపటం సాధ్యమే అవుతుందని నిశ్చయంగా నమ్మవచ్చు.

---

చెన్నపురి : వావిళ్లప్రెస్సున ముద్రితము.—1956

# బుక్‌మన్స్ ప్రచురణలు

**1. జీవితమ్:**

సాంఘిక సంక్షేమగ్రంథం. ఇందలి సుఖజీవనసూత్రాలు మననం చేసుకొని ఆచరిస్తే చిత్తశాంతి కల్గితీరుతుంది. 6 అ.

**2. గోపురంమూడయ్య:**

ఆనంద్ - శాస్త్రి - చిట్టి - సత్యాలు అనే నలుగురు సిద్ధహస్తుల సంయుక్త గేయ రచనలు. సత్యాలు గారి 'శబరి' ఎంతటి పాషాణహృదయాన్నయినా కరగిస్తుంది. తక్కినవి వినోదపూరితములు, నీతిదాయకములున్ను. 6 అణాలు.

**3. సిరుమారా సాహసములు:**

ఒక్క దెబ్బతో రెండు పిట్టల్ని సంపాదించిన సాహసమూ సమయోచి



తమూ గల, గొప్ప సమరుని అద్భుతకథ. చేత పట్టింది మొదలు పూర్తి అయేవరకూ విడిచిపెట్టలేమనటం అతిశయోక్తి కాదు. ...12 అణాలు.

**4. రామచిలుక:**

మానవ చిత్తప్రవృత్తులను చిత్రించే అద్భుత సాంఘిక కథలు. ఇందులోని ఏడు కథలూ ఏడు మణులే. ప్రతి కథా మన తెనుగు సంప్రదాయాన్నీ, తెనుగుతనాన్నీ ప్రతిబింబిస్తూ, వినోదంతో పాటు విజ్ఞానాన్ని కలిస్తున్నది. ఆకర్షణీయమైన త్రివర్ణ ముఖచిత్రం. రు. 1/8

**5. పదహారు రాత్రులు:**

'చక్కని కథలు, చిక్కని శైలి, ఆద్యంతం మనోహరమైన రచన. ఆలోచనకు ఆలోచన, చమత్కారానికి చమత్కారము, విజ్ఞానానికి విజ్ఞానము, యుక్తికి యుక్తి, ఉపజ్ఞకు ఉపజ్ఞ, శైలికి శైలి, జిగికి జిగి, బిగికి బిగి— అన్నీ సమపాళ్లుగా ఉండి, చదవడానికి బహు యోగ్యంగా ఆహ్లాదకరంగా ఉన్నదీ పుస్తకం.' రు. 1/8

**6. చిలుక చెప్పింది:**

(కమనీయమైన 52 కథలు) రు. 3/4



# చిలుక చెప్పింది

*

ఏ కాలమునాడు రచింపబడినవో, అపురూపములైన ఈ 52 కథలు!— ఆహా! అద్భుతమైన ఆ శైలి, ఆ జాతీయముల పొందిక, ఉపమానముల అమరిక, అస్సలయిన తెనుగు తీయందనము ఎటువంటిదో ఈ నాటికికద మనం చూడగలిగింది! కథ అనేది ఎలా వుండాలి ఎలా చెప్పాలి?—అనే సమస్యలకు ఈ పుస్తకం సూటిగా జవాబు చెబుతున్నది. కథలా ఇవి—ఒకొక్కక్కటిన్నీ ఒకొక్కక్క రత్నం, మణిపూస, నీతినిధి, అమృతగుళిక!—కథావస్తువు ఒకవంక, భాషామాధుర్యం ఒకవంక— మనల్ని మనం మరచిపోయేట్టు చేసి, మరొక ప్రపంచంలోకి లాక్కొని పోతున్నవి. వేయేల?—ఇప్పటివరకు ఇటువంటిమహత్తర గ్రంథం తెలుగుభాషలో కని విని యెరుగమంటే ఎంతమాత్రమూ అతిశయోక్తి కాదు. అక్షర లక్షలు విలువ చేసే ఈ కథలను ఇప్పుడే చదవండి. తన్మయత్వం పొందండి!—

సుప్రసిద్ధ పండితులు శ్రీ బులుసు వేంకట రమణయ్యగారి పరిష్కృతి. విఖ్యాత భాషావేత్తలు డా॥ గిడుగు వేంకట సీతాపతిగారి అమూల్యమైన ఉపోద్ఘాతము.

క్రౌను 1/8 సైజు 280 పేజీలు. ముచ్చటయిన ముద్రణ. ముద్దులుగుల్కు మూడురంగుల ముఖచిత్రం. చక్కని గెటప్. దిట్టమైన అట్టబైండు.

వెల రు. 3/4.



*

| | | | | |
|---|---|---|---|---|
| 1. | నీతిదీపిక (చాణక్యనీతి) శ్రీ సత్యకవి | ... | 0 | 6 |
| 2. | ఆత్మజ్యోతి (టాల్స్టాయి కథ) | ... | 0 | 12 |
| 3. | ప్రేమాంజలి ( ,, ) | ... | 0 | 12 |
| 4. | ప్రవాసి ( ,, ) | ... | 0 | 12 |
| 5. | తూలిక (చిత్రకథా సప్తకము) | ... | 0 | 12 |
| 6. | అమరగాథలు : అలెగ్జాండరు-శ్రీ ఎం. ఎస్. శాస్త్రి | ... | 0 | 12 |
| 7. | దివ్యవాణి-శ్రీ కూచి నరసింహముపంతులు, బి. ఏ. | ... | 0 | 12 |
| 8. | జన్మభూమి (నవరసభరితమైన ఆఱు నాటికలు) | ... | 0 | 12 |
| 9. | దేవదూత (టాల్స్టాయి కథ) | ... | 1 | 0 |
| 10. | చిత్రసీమ ( ,, ) | ... | 1 | 0 |
| 11. | శుభోదయము ( ,, ) | ... | 1 | 0 |
| 12. | సాహిత్యంలో సర్పం | ... | 1 | 0 |
| 13. | సాహిత్యంలో జంతుజాలం | ... | 2 | 8 |